కనపడ్డా,లోపల ఆరు,ఏడు వేలమంది కూర్చోవడానికి అనుకూలంగా ఏర్పాట్లు జరిగాయి.

నేను విశ్వ ప్రయత్నం చేసి ఇండియన్ అసోసియేషన్ సెక్రటరీగా ఈ సభకు హాజరు కావడానికి ఒక టికెట్టు సంపాదించుకున్నాను. బ్రిటీషు ప్రధాని గారు ప్రపంచ పరిస్థితులన్నింటిని సమీక్షించి యుద్ధంలోకి యెందుకు దిగవలసి వచ్చిందో అనేక

కారణాలు చెప్పి ప్రజలు భీతావహులు కాకుండా ధైర్యంగా వుండి అన్ని విధాల తమకు తోడ్పడవలసిందని ప్రబోధం చె శారు।అం త బ్రహ్మాండమైన ఉపన్యాసం నేనెన్నడూ వినలేదు. అక్కడ చేరిన వారంతా నిట్టూర్పు విడవడానిక్కూడా భయపడినంత నిశ్శబ్దంతో ఉపన్యాసం విన్నారు.

ఉపన్యాసం పూర్తి కాగానే మామూలు చప్పట్లు కూడా లేకుండా జనం అంతా లేచి నుంచున్నారు .వెంటనే ఆంగ్ల జాతీయగీతం ఆలపించడంతో సభ ముగిసింది . సబికులంతా ఎవరి స్థానాల్లో వాళ్ళు నిలబడే వున్నారు.ప్రధానమంత్రి గారు వారి అనుయాయులు ప్లాట్ ఫారం దిగి బైటికొచ్చారు .

వారు వెళ్ళడం నా పక్క నుంచే వెళ్ళారు. ప్రధానమంత్రి నా దగ్గరకు రాగానే పులకాంకితుడినై, భక్తి భావంతో నమస్కరించాను మన పద్ధతిలో ఆయన నాకేసి చూసి మందహాసం చేసి వెళ్ళిపోయారు.నేను మందహాసంతో ఆకాశంలో తేలిపోయినట్టుగా అయ్యాను. హాలులో జనమంతా ఏ హడావుడి లేకుండా ఒక్క వరసలో బయటికి వచ్చారు.నేనా సభా ప్రధాని ఉపన్యాసం తలుచుకుంటూ ఏదేదో ఊహా ప్రపంచంలోకి పోయి నేలమీద నడుస్తున్నానొ ,ఆకాశంలో విహరిస్తున్నానో తెలియని స్వప్నావస్థలో ఎవ్వరితోటి మాట్లాడకుండా నా బసకు చేరుకున్నాను.

యుద్ధప్రకటన కాగానే క్షణంలో వాతావరణం మారిపోయింది. ఆ మర్నాటి నుంచి హిమపాతం పడ్డట్టు అందరిలో ఉత్సాహం చల్లారిపోయి, అందరి వదనాల్లో ఆనందం ఆరిపోయి ప్రతివాడు ఏదో ఆందోళనతో, భయంతో ఉత్తర క్షణంలో ఏమవుతామనే ఆలోచనలతో అంతిమ విజయం ఎవరిదోనన్న సందేహంతో తిరుగుతున్నారు తప్ప మాములు ధోరణిలో నిశ్చింతా, నిర్భయం, ఆత్మ విశ్వాసం, ధైర్య సాహసాలు ఎక్కడా కనపడకుండా పోయాయి. చాలా చిత్రమనిపించింది. యుద్ధాలను గురించి పుస్తకాల్లో చదవడమే గాని ప్రత్యక్ష్యనుభవం ఎక్కడిది? అందు చేతను నా బొ టి యువకులకు యుద్ధ స్వరూపం, దాని పరిణామం, దైనందిన జీవితాన్ని అది ఎలా మార్చగలిగేది ఇత్యాది వి షయాలన్ని అనుదినం కూడా ప్రత్యక్షంగా అనుభవంలోకి వస్తున్నాయి.

వారం పది రోజులు గడిచేటప్పటికి ఎడింబరో పట్టణమే, దాని స్వరూపమే ,దాని పద్ధతులే మారి పోయి ఊరు ఊరంతా యుద్ధ భూమిలా సైనికుల్లా నిలబడ్డదేమో అనే

భావం కలిగింది. మామూలు సంచలనం కనపడకుండా ఎటు చూసినా యుద్ధ సన్నాహాలే ఊరి బయట ఏ కొండల మీద చూసినా యుద్ధ కవాతులే. పద్దెనిమిది సంవత్సరములు పై బడ్డ ప్రతి యువకుడు యుద్ధంలో చేరిపోతున్నాడు తన చదువు,తన తెలివి,తన ఐశ్వర్యం, తన సంపాదన అన్నీ విడిచి పెట్టి. ధనికులు, పేదలు ,విద్యార్థులు, కార్మికులు, అందరికి ఒకటే ఆలోచన.

ఈ ప్రమాదం నుంచి దేశాన్ని రక్షించాలి. ఆ బాధ్యత మనదే గాని మరెవ్వరిది కాదు ।మనమంతా వెళ్ళి దేశం కోసం మన రక్తం ధార పోసి మనమందరం నిహతులమైనా,జర్మనీని ఈ జన్మలో ఇంక లేవకుండా అధః పాతాళానికి తొక్కి మనం విజయం సాధించాలి. "లాంగ్ లివ్ ఇంగ్లండు రూల్ బ్రిటానియా గాడ్ సేవ్ థింకింగ్" అనే నినాదాలు తప్ప మరేమి వినపడ్డం మానేశాయి .ఎవరి ముఖంలోనూ నవ్వు తుళ్ళూ కనిపించడం మానేసింది.పగలంతా ఆకాశం మీద వి మానాలు బయ్యిమని శబ్దం చేస్తు విహారించడం మొదలు పెట్టాయి.

ఇంతకు ముందెన్నడు ఏ యుద్ధంలోను విమానాలు ఉపయోగించలేదట ఎవరూను, అందుచేతను అందరికి ఇదో కొత్తగాను,కొంత భయంగాను ఉన్నా వీటితోనే మనం విజయం సాధిస్తాం అనే ధైర్యం కూడ ప్రజల హృదయాల్లో స్థిర స్థానం ఏర్పాటు చేసుకుంది. రాత్రులు ఏ వీధిలోనూ దీపాలుండకూడదని అధికారులు శాసించారు.ఇంట్లో

దీపాలు కిటికీల్లోంచి వెలుపలకు కనపడకుండా నల్ల తెరలు దట్టమైనవి వేసుకోవలెనని హెచ్చరికలు జారీ చేశారు. రాత్రులు తిరిగే మోటార్లకు కూడా ముందుండే దీపాలు బాగా తగ్గించి ఆ మోటారు లైట్లకు పై భాగం నల్ల రంగు పూయించారు. కొంచెం ఇంచు మించుగా ప్రతి రెండు మూడు ఫర్లాంగులకు ఒక భూగృహం లాంటిది విశాలమైనది నివి ఎషాల మీద నిర్మాణాలు చేశారు. పైన తిరిగే శత్రు విమానాల నుంచి బాంబులు పడితే చాల ప్రమాదం కనుక ప్రజలు భీతిల్లక, కంగారు పడక, తొట్రు పాటు లేకుండా ఈ భూగర్భ మందిరాల్లో తలలు దాచుకోవలెను.

విమానాలు వస్తుంటే ముందుగా రైలు కూత లాంటి కూత వినపడుతుంది. అది వినగానే స్త్రీ, బాల, వృద్ధులంతా ఈ భూగృహాల్లోకి పారిపోవాలి. రోడ్డు మీదున్న పురుషులు ఎక్కడ వారక్కడే బొర్లగిలా పడుకోవాలి. ఇలాంటి ఏర్పాట్లన్నీ ప్రజలకు

తెలియపర్చి ఆ ఆపత్సమయమందు ప్రవర్తించవలసిన విధానాలు నాటకాల్లో రిహార్సల్లాగా ప్రజలకు అలవాటు చేశారు. పెద్ద పెద్ద ఫ్యాక్టరీలతో మామూలుగా ఉత్పత్తి చేసే వస్తువులను నిలుపు చేసి, అన్నిటి లోను యుద్ధవసర వస్తువులనే తయారు చేయించడం మొదలెట్టారు. మేం పై వాళ్ళం ఇక్కడ మీకు స్థానం లేదన్నట్టు అనేక విధాల మాకు స్ఫురింపజేస్తున్నారు. మేం కూడ యుద్ధంలో చేరుతాం .మమ్మల్ని కూడ చేర్చుకోండని మన వాళ్ళు యెంత బ్రతిమాలినా యెవ్వరిని చేర్చుకోలేదు. మమ్ములను, మా దిన చర్యలనూ, రహస్యంగా, అనుక్షణం ఎవరో గమనిస్తున్నారనే భావన మా అందరిలోను కలిగింది। ఈ అనుమానం ఎందుకు కలిగిందంటే ఏ ఒక్కరం

సరియైన సమాధానం చెప్పలేని స్థితిలో ఉండిపోయాం . మా ఉత్తరాలు మాలో ఎవరికి ఎక్కడనుంచి వచ్చినా అవన్నీ పోస్టాఫీసులో మాకు తెలియకుండా తెరిచి దేశభాషల్లోవన్నీ ఆంగ్లంలోకి తర్జుమా చేయించుకొని అవి మళ్ళీ ఆనవాలు తెలియకుండా కవర్లు అతికించి ఆ తరువాత మాకు బట్వాడా చేసేవారు. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదన్న సంగతి జగద్విదితం. ప్రతి వాళ్ళు మేము ఎక్కడ కనపడ్డా మేము కూడా శత్రు పక్షంలో చేరామో, చేరబోతున్నామో అనె దృష్టితో చూడటం తప్పనిసరి అయింది.

పోనీ ఇదంతా భరించలేక ఇంతటితో చదువు ముగించి ఇంటికి పోదామంటే దానికి పర్మిషననీ, పాస్ పోర్టని బోలెడంత తతంగం జరిగితేనేగాని యెవర్ని కదలనివ్వడం లేదు.ఇలా ఉండగా భారతీయులంతా కూడా యుద్ధంలో లో చేరి తమకి

అనుకూలంగా సహాయం చేయడానికి సంసిద్ధులై వున్నారనే వార్త ఆంగ్ల పత్రికలన్నింటిలోనూ కనపడ్డది.

దానితో మామీద అనుమానం కొంత తగ్గి విశ్వాసం ఏర్పడ్డం మొదలెట్టింది.

ఇలా ఉండగా ఒక రోజు మధ్యాహ్నం మేమంతా విద్యాలయం లో క్లాసులో ఉండగా బ్రహ్మాండమంతా ఒక్కసారి బద్దలైనంత భయంకరమైన శబ్దం వినపడ్డది. మా విశ్వవిద్యాలయమంతా దద్దరిల్లిపోయింది. భూకంపమా అనుకున్నాం. అదికాదు విమానాల దాడా అనుకున్నాం ఎక్కడా విమానాల ధ్వనే లేదు! అక్కడ అక్కడేనన్న మాటేమిటి ఊరంతా అశె ష జనం హడలి పోతు ప్రాణాలర చేతుల్లో పెట్టుకొని కూర్చున్నారు. మళ్ళీ ఇంకో మాటు రెండు మూడు సార్లు, ఆ శబ్దాలు వినపడ్డాయి. మా ప్రొఫెసర్ ఉపన్యాసం కట్టిపెట్టి తల వంచుకొని భగవత్ ప్రార్ధన చేస్తున్నట్టు

నిలబడ్డాడు. మరో సారి శబ్దం అయిన తరువాత మరే శబ్దం అవలేదు.

మరో అయిదు నిమిషాలు అందరం నిశబ్దంగా ఉండిపోయాం.ఇంతలో ఒక నౌకరు మా ప్రొఫెసర్ గారికి చీటీ చూపించి వెళ్ళిపోయాడు. వారు మమ్ములను నిశబ్దంగా ఇళ్ళకు వెళ్ళిపొమ్మని సెలవిచ్చి పంపించేశారు .మేము భయంతో, దడతో ఒకరితో ఒకరు మాటయినా మాట్లాడుకోకుండా మా బసలకు బయలు దేరాం. దారిలోనే ఆ శబ్దం యేమిటొ మాకు తెలిసిపోయింది. ఎడింబరోకి సమీపంలోనే కొద్ది మైళ్ళ దూరంలో ఫర్తు ఆఫ్ ఫోర్తు అనే ఓడరేవు వున్నది. స్కాట్లాండు తీర సంరక్షణకు అక్కడ యుద్ధ నౌకలన్నీ యుద్ధ సన్నాహంతో వున్నాయి. జర్మనీ వాళ్ళు ఇది ఏలా కని పెట్టారో కాని కని పెట్టి రెండో కంటి వాళ్ళకి తెలియకుండ జలాంతర్గాములతో వచ్చి టార్పిడో అనే ఫిరంగితొ ఇక్కడున్న యుద్ధ నౌకలను మూడు దెబ్బలతో ముంచేసి నిర్భయంగా వెళ్ళిపోయారని తెలిసి పోయి భయ భ్రాంతులను చేసింది. మేం చేసేదేం లేక ఎవరి బసకు వాళ్ళు చేరుకున్నాం.

వచ్చేవారం మరోభాగం

33వ భాగం

జనమంతా యుద్ధకాల జీవితానికి క్రమేణా అలవాటు పడ సాగేరు. భయం వదలక పోయినా మృత్యువెపుడూ సన్నిహితంగానే, అతి సన్నిహితంగానే వున్నదని తెలిసినా ఈ రోజుల్లో ఈ యుద్ధ పద్ధతుల్లో మృత్యువు రణరంగంలోనె కాక యెక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమవుతుంది, అనే సత్యం అందరు తెలుసుకున్నా, యేదో మొండి ధైర్యంతో, ఏదో నిర్లక్ష్యంతో యెలాగైనా చచ్చయినా శత్రువులను రూపు మాపి దేశాన్ని రక్షించాలనే తపన, భావం ప్రతి హృదయంలొను నాటుకుపోయింది. యెవరు శత్రువు ఎందుకు మనం శత్రువనుకుంటూన్నాం? అనే ప్రశ్న పరంపర కొందరు వెలిబుచ్చినా దానికి సమాధానం చెప్పవలసిన అధికారులు మౌన ముద్ర వహించి శత్రు సంహారం చేయడమే మన విధి. మన ధర్మం అది తప్ప తక్కిన విషయాల తర్క విత్కరములతో మీకేం పనిలేదని ప్రబోధాలు చేస్తున్నారు.

దైనందిన జీవితం ఏదో ఒక దారిన నడుపుకోవడం అలవాటు చేసుకుంటూంటే ఒకనాటి రాత్రి సుమారు మూడు గంటలకి శత్రు విమానాలు వస్తున్నాయని సూచనగా కూడా వినపడేసరికి నిద్దరమత్తులో వున్న అశేష జనం ఆబాల గోపాలం ఉలిక్కి పడి నిద్ర నుంచి లేచి భయభ్రాంతులై , బట్టలు మార్చుకోవాలా అక్కడలేదా అనే మీమాంస పక్కన పెట్టేలోపునే విమానాలు రావడం, అక్కడొకటి, అక్కడొకటి బాంబులు పడేసి ఇక్కడి విమానాలు పైకెగిరే లోపునే , శత్రు విమానాలు పారిపోవడం కూడా జరిగింది. చాలామంది స్త్రీ పురుషాదులందరూ పడక దుస్తులతోనే భయభ్రాంతులై విధిలోకి పరుగెత్తు కొచ్చారు. అటు ఇటూ రక్షణ గృహాలు వెతుక్కుంటూ పరుగులు తీసేరు. ఒక ముసలాయనా, ఒక ముసలావిడ రోడ్డు మధ్యన పరుగెడుతున్నారు .వారు దంపతులు అవునో కాదో తెలియదు కాని పడుగెడుతున్న వాళ్ళల్లా ఆగిపోయి ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఒక క్షణం నిలబడి అమాంతం రోడ్డు మధ్యగా బోర్లా పడుకున్నారు. అటూ ఇటూ పరుగెడుతున్న జనం ఇదేమిటి వీళ్ళు ఇలా పడిపోయారు కొంప తీసి భయంతో చావలేదు కదా,అని వాళ్ళదరికి చేరి పైకి లేవ తీయబోయారు.

అరక్షణంలో కొన్ని వందల మంది చుట్టు చేరారు. ఇంతలో వాళ్ళంతట వాళ్ళు

దగ్గరికి వచ్చిన వాళ్ళ చేయూతతో గజగజ లాడుతూ లేచి నిలబడ్డారు.జనమంతా హిప్ హిప్ హురే అని సంతోషంతో అరుస్తుండగా విమాన దాడి అయిపోయిందని క్షేమంగా ఇంటికి వెళ్ళవచ్చునని తెలియ పర్చడానికి సైరన్ కూత వినపడ్డది.

అది వినేసరికి భయం లోంచి బయటపడి అందరు ఒక్కసారి నిట్టూర్చినట్టు పెద్ద నవ్వు నవ్వుతూ ఒకరి దుస్తులను ఒకరు చూసి సిగ్గుపడుతు గృహోన్ముఖులయ్యారు.

ఈ రీతిగా ఇదో కొత్త ఆపద వచ్చి పడిందని జనంలో మళ్ళీ భయం బయలుదేరినా ఏలాగో ధైర్యం తెచ్చుకొని కాలక్షేపం చేసుకుంటున్నారు. ఈ విమాన దాడులలో జన

సమూహానికి సహాయపడటానికి కొత్త రకమైన రక్షక భటులు ఏర్పాటై, ఇరవై నాలుగు గంటలు వాళ్ళు రోడ్లంట గస్తీ

తిరగడం ఒక కొత్త దృశ్యం. సాయంకాలం మామూలుగా కొండల మీదికి వెళ్ళడం తగ్గించారు జనం. నిత్య జీవితం అనేక విధాల కేవలం స్తంభించక పోయినా కుంటుపడిందని చెప్పక తప్పదు.

మేము కాలేజికి మాములుగా వెడుతూనే ఉన్నాం. పాఠాలూను మాములుగానె జరుగుతూనే ఉన్నాయి. ఒక రోజు ఊళో ౖ అంతా జాతీయ పతాకాలు చిన్నవి సూదులు గుచ్చి అమ్మడం మొదలెట్టారు. ప్రతి వాళ్ళు ఆబాలగోపాలం ఒకళ్ళు కూడా

విడవకుండా కొంటున్నారు. ఈ రాబడంతా యుద్ధ నిధికి అని అందరికి తెలియపరిచారు. మేమందరం తలోటి కొని మా కోట్లకి తగిలించుకొని క్లాసులకు హజరయ్యాం. క్లాసులో పాఠం జరుగుతోంది. హఠాత్తుగా మా వెనకాల బల్లల్లో ౕ సంచలనం బయలు దేరింది. కుడి పక్క నుంచి ఇద్దరు ,ఎడమ పక్క నుంచి ఇద్దరు యువతులు జాతీయ పతాకవర్ణంతో ౕ తయారైన దుస్తులు ధరించి ఆ రంగులే నెత్తిన సిపాయి టోపి ధరించి క్లాసు మధ్యన ఆందరి దగ్గర యుద్ధ నిధికి వసూళ్ళు ప్రారంభించారు.

వారు నలుగురు ఒకచేతిలో వీధిలో మేం కొన్నలాంటివి చిన్నచిన్న జాతీయ పతాకాలు పళ్ళెం నిండా పోసుకుని రెండవ చేతిలో పైన రంధ్రం నుండి తక్కినదంతా సీలు చేసిన డబ్బీలతో మనిషి మనిషి దగ్గరికి వచ్చి వసూళ్ళు ప్రారంభించారు వాళ్ళు. లోపలకు ఎలావచ్చారో, ఎవరు తీసుకొచ్చారో ఎవరికీ అర్థం కాలేదు. అక్కడ వాళ్ళను మీరిక్కడ కెలా వచ్చారని గాని, కోప్పడటానికి గాని వీలయిన సమయము కాదు .ఎవళ్ళ కు తోచినది వాళ్ళు ఇస్తున్నారు. ప్రొఫెసర్ గారు నిర్ఘాంత పోయి ఈ దృశ్యం

చూస్తు స్థంభించి పోయినట్టు నిలబడిపోయరు.

ఒకర్ని కూడా విడిచి పెట్టకుండా క్లాసులో ఉన్న విద్యార్ధులందరి దగ్గర వాళ్ళు వసూలు చేసుకున్న తర్వాత తిన్నగా ప్లాట్ ఫారం ఎక్కి ప్రొఫెసర్ గారి వద్దకు వెళ్లి ఈ వైపున ఇద్దరు, ఆ వైపున ఇద్దరు నిలబడి నలుగురు పతాకాలు తీసి వారి కోటుకి గుచ్చి, నవ్వుతూ చెతిలో డబ్బీని ముందుకు జాపారు. ప్రొఫెసర్ గారు మందహాసం చేసి జేబులు తడుముకో ౕవడం మొదలెట్టారు.

ఏ జేబులో ఒక్క పెన్నీ కూడా చేతికి తగలక పోవడంతో తెల్లబోయి ఏమనాలో తెలియక నిలబడిపోయారు. కుశాగ్ర బుద్దులైన విద్యార్ధులంతా ఆయన ఇబ్బంది గ్రహించి ఎవరికి తోచిన , ఎవరి చేతికందిన పెన్నీలు అర షిల్లింగులు ,అర షిల్లింగులు ఈల వేస్తు ప్లాట్ ఫారం మీదికి గిరవాటెట్టారు .ఆపిల్లలు నవ్వుతు అవన్ని ఏరుతూ కూర్చున్నారు . మా ప్రొఫెసర్ గారు మళ్ళీ ఈ వేడుక చూస్తు మళ్ళీ ముఖంలో మందహాసం చిందిస్తు ఈ వేళ కిదిచాలుననుకుంటున్నాను .ఇంతటితో క్లాసు ముగిద్దాం

అని వారు రూంలోకి చక్కా పోయారు .విధ్యార్ధులంతా కరతాళ ధ్వన్లు చేస్తు నవ్వుతు కొందరు డబ్బు లేరడంలో ౕ పిల్లల్లకు సాయం చేస్తున్నారు ,మేమంతా బయటకి వచ్చాం.

ఇక్కడ ఏం జరిగినా ఏం ఉపద్రవం ముంచుకొచ్చిన ప్రొఫెసర్లు ఉద్రిక్తులు కారు. ఆగ్రహం ప్రదర్శించరు. ఏ విషమ పరిస్తితి వచ్చినా ప్రశాంతంగా ఎదుర్కోని విధ్యార్ధులతో పేచీలు పెట్టుకోకుడా వాళ్ళ మనసులు నొవ్వకుండ వ్యవహరిస్తారు। వారు పాఠం చెప్పేటప్పుడు టైం కాగానే గంట వినపడనవసరం లేకుండానే రెండు మూడు నిముషాల ముందు గానే వారి ఉపన్యాసం ముగించి క్లాసు విడిచి పెడతారు. ఒక రోజున ఒక తమాషా జరిగింది. ఆ రోజు ఇంగ్లీషు పాఠం జరుగుతుంది .పన్నెండు గంటలకు క్లాసు విడిచి పెడితే అంతా ఫలహారాలకు,బోజనాలకూ ఇళ్ళకు పోతారు . ఆ రోజున ప్రొఫెసర్ గారు తన్మయులై , పాఠం ఏంతో చక్కగా చెబుతున్నారు.కాలం యెవరు గమనించలేదు.పన్నెండు కుడా అయిపోయింది . కొందరు విధ్యార్ధులలో అశాంతి బయలు దేరి కొంచెం శబ్దం చేయడం మొదలెట్టారు. ప్రొఫెసర్ గారి వరకు ఆ శబ్దం ప్రసరించలేదు. మరో పది నిముషాలు గడిచింది. విధ్యార్ధులు గాలరీ మీద తమ

పాదరక్షలతో శబ్దం చేయడం మొదలెట్టారు. ఏమిటి శబ్దమని ప్రొఫెసర్ గారు ప్రశ్నార్ధకంగా చూశారు .దానికి సమాధానంగా మరింత ధ్వని చేయడం మొదలు పెట్టారు. అప్పటికాయన అసలు విషయం గ్రహించకో ని ,"నాయనలారా నేను పరాకుగాకాలం గమనించక , మీకిబ్బంది కలగజేసినట్టున్నాను. కాని వెదజల్ల వలసిన ముత్యాలు మరికొన్ని వుండిపోయినాయి। తరువాత మీ ఇష్టం ". ( i am sorry Gentlemen, but i have a few more pearls to throw away) అన్నారు నవ్వుతూ.Throwing pearls before swine అని ఆంగ్లంలో ఒక సామెతున్నది. పందుల ముందు ముత్యాలు జల్లితే వాట్లకు ఏం తెలుస్తుంది? అవి ముత్యాలనీ, విలువైనవనీ. ఆమాట ప్రొఫెసర్ అనడంతోటే మళ్ళీ హాలంతా నిశ్శబ్దమైపోయినది.

ఒకడు కదిలితే ఒట్టు. గట్టిగా ఊపిరి కూడా పీలుస్తే ఒట్టు. ప్రొఫెసర్ గారు మందహాసం చేస్తూ మరి ఒక పావుగంట ఉపన్యాసం గావించి "అబ్బాయిలు మీరింక ఇంటికి వెళ్ళవచ్చు" అని," క్షుద్బాధ గ్రహించలేక పాఠంలో నిమిగ్నుడునై మిమ్మల్నింత సేపు కూర్చో పెట్టి బాధ కలిగించాను,మీరేమీ అనుకోకుండా మీ ఇళ్ళ కు వెళ్ళి ఇంత ఆలస్యమైనందుకు మామూలు మోతాదు కంటె రెట్టింపుగా, యుద్ధం విషయం కూడా మరిచిపోయి భోం చేయండి" అని ఆయన గదిలోకి చక్కాపోయారు.ఇక్కడ పద్ధతది. ప్రొఫెసర్లకు విద్యార్ధులకు వుండే అభిమానం, గౌరవం అటువంటిది.మనదేశంలో ' అయితే అటువంటి అల్లరి చేసిన విద్యార్ధులకు ఎటువంటి కఠిన శిక్ష పడేదో వూహించడం కూడా కష్టం .

ఇక్కడ ప్రొఫెసర్లకు చాలమందికి చతురోక్తి, హాస్యోక్తి , సమయ స్ఫూర్తి చాల ఎక్కువ. ఇక్కడ పద్ధతేమిటంటే ప్రొఫెసర్ ఏ కారణం చేతనైన క్లాసుకి రావడానికి వీలు కాకపోతే ఈ వేళ మీ క్లాసుకి పాఠం చెప్పడానికి వీలుపడదు అని ఒక కాగితం మీద

వ్రాసి క్లాసు బయటనున్న కారిడార్ లో నోటిసు తగిలిస్తారు. అలాంటి నోటీసు మాకా రోజున ప్రత్యక్షమైంది. The professor will not be able to attend the classes today.అని నోటీసున్నది.

మేం చూచి బయటకి వెడుతుంటే ఒక అల్లరి పిల్లవాడు తను తెలివైన వాడిననుకొని ప్రొఫెసర్ గారి మీద చలోక్తి వి సురుదామనుకొని ఆ నోటిసు దగ్గరి వెళ్ళి classes అనే శబ్దంలో Cఅనే మొదటి అక్షరం కొట్టేసి చక్కాపోయాడు. పోతే వి ంగిలింది Lassesఅనగా ఆడపిల్లలని అర్ధం. మరునాడు ప్రొఫెసర్ గారు ఇది చూసి ఏమీ ఆగ్రహించకుండా ఎవరినీ

పల్లెత్తు మాట అనకుండా Lఅనే రెండో అక్షరం కొట్టేసి మామూలుగా పాఠం చెప్పి చక్కా వెళ్ళి పోయారు.

చాలామంది ఆ నోటీసు బోర్డు వైపు చూడక ప్రొఫెసర్ గారు చూసేరా? లేదా? చూస్తే కోపం రాలేదా? అని తమలో తాము తర్జన భర్జన చేసుకుంటూ క్లాసు కాగానే ఏకముఖంగా అందరు నోటీసు బోర్డు వైపు పరిగెత్తి చూసేసరికి, యల్ పోయి, Asses మిగిలింది. మా ఎత్తుకు ప్రొఫెసర్ గారు వేసిన పై ఎత్తుకు మేము సిగ్గు పడి తల వంచుకోని చక్కా పోయాం.ఇటువంటి పెంకెతనాన్ని ఎంతో చతురతతో సర్దుకుపోయారు ప్రొఫెసర్ గారని ఆశ్చర్యపోయాం. మాలో వేము. ఆయన సమయ స్ఫూర్తికి అభినందిస్తు చక్కాపోయాం.

వచ్చేవారం మరోభాగం

## 34వ భాగం

ఈ మధ్యన ఒక నాడు ఎన్నడూ అనుకోని, ఊహించని తమాషా ఒకటి చేశాడు మా స్నేహితుడు. ఇది వరకు వేరె సందర్భంలో కూడా అతని పేరు వచ్చింది. ఇక్కడున్న ఆంధ్రులందరిలోనూ అతను బహు చురుకైన వాడు, మాటకారి. అంతే కాకుండా హాస్యప్రియుడు, మంచి వాక్చమత్కృతి కలవాడు. అందరినీ మాటల్తో మురిపించి మరిపించి గలవాడు. ఆంధ్ర భాషా ప్రియుడు, యత్ కించిత్ కవి. సమ్మోహనంగా పొగడగల గాత్రమాధుర్యం కలవాడు. అయితే వట్టి అల్లరివాడు. అస్తమానం ఎవరినో ఒకరిని ఏదో అంటూ, ఏడిపిస్తు, మళ్ళీ నవ్విస్తు వుండేవాడు.

ఈ తమాషా తల పెట్టి మమ్మలందరిని హడలుగొట్టి, చచ్చేటట్టు నవ్వించిన పెద్దమనిషి దుగ్గిరాల గోపాల కృష్ణయ్య. అతను తరచుగా నా గదికి వస్తూ, కబుర్లు చెబుతు, వెడుతుండేవాడు. మొట్ట మొదట నన్ను చూచిన నాటి నుంచి నె నంటే యెంతో ఆదరం, అభిమానమూను. శ్రీ ఆనందకుమార స్వామి గారు వచ్చిన నాటి సభలో తలవని తలంపుగా నె ను చదివిన భాగవత పద్యాలు వినడంతోనే నా మీద అభిమానం మరో పది రెట్లు ఎక్కువయింది.

ఒకరోజు రాత్రి సుమారు పది గంటల వేళ నేను శ్రద్ధగా, దీక్షగా చదువుకుంటుండగా గోపాల కృష్ణయ్య చాల హడావుడిగా, కంగారుగా అతి గంభీరమైన మొహంతో వచ్చి తలుపు కొట్టాడు. ఎవరా ఇప్పుడు వచ్చేవారు? అనుకుంటూ, నేను లేచి తలుపు తియ్యడం తోటె, ఒక్కడగు లోపలికి వేసి "బాబు, నువ్వు త్వరగా డ్రస్సు వేసుకో, మన రావుకి హఠాత్తుగా ఏదో జబ్బు చేసింది.ఒళ్ళు తెలియకుండా చాల బాధ

పడుతున్నాడు. నువ్వు వెంటనే అక్కడికి పరిగెత్తు, నేను వెళ్ళి మన వాళ్ళని పదిమందిని కేకేసి, డాక్టర్ ని కూడాతీసుకు వస్తాను." అని ఇంకా నా మాటేమీ వినిపించుకోకుండ ఒక్క వుడామని వీధిలోకి పరిగెత్తాడు.

నేనమాంతం నిల్చున్న వాడ్ని చతికిల పడ్డాను. ఈ రావు అనే ఆయన మా స్నేహితుడు, ఆయనా కొద్ది మాసములలో చదువు పూర్తయి, స్వదేశానికి తిరిగి వెళ్ళ నున్నాడు. అయిదున్నర అడుగుల ఎత్తు మనిషి కొంచెం స్థూలకాయుడు. మా

అందరిలోకి బలిష్టుడులా కనపడేవాడు. హఠాత్తుగా పిడుగు లాంటి ఇతనికి ఏమి వచ్చిందా అని కంగారు పడుతు,గబగబ సూట్ గీటు మార్చుకొని వీధిలోకి పరిగెత్తాను.

త్వరగా అక్కడ చేరవలెనని ఆదుర్దాయె కాని అనుకున్నంత తొందరగావెళ్ళలేక పోయాను. ఎలాగైతేనేమి రావుగారి గదికి చేరి, గోపాలకృష్ణయ్యగారు వచ్చినంత హడావుడిగా నేను తలుపు కొట్టాను.లోపల నెమ్మదిగా మాటలు వి నపడుతున్నాయి ఎవరో వచ్చి తలుపు తీశారు. నేను లోపల అడుగు పెట్టి నిశ్చేష్టుడనై, నిర్ఘాంత పోయి నిలబడిపోయాను.

రావు గారు నల్లరాయిలా నవ్వుతు కూర్చున్నారు, మరి నలుగురితో పేకాడుతున్నాడు. చుట్టు ఏడెనమండుగురు నిలబడి

వేడుక చూస్తున్నారు. మొదట ఎవ్వరు చూడనట్టు నటించి తరువాత తలెత్తి అరే! ఇదేమిటి? మన పార్వతీశం. అలా వున్నావేమిటి వంట్లో కులాసాగా వుంటుందా అన్నారు. అప్పటికి రావు గారు చేతిలో పేకముక్కలు కింద పడేసి గభాలున లేచి నుంచోని నా దగ్గరకు వచ్చి నా వీపు మీద నేను ముందుకి పడేటట్టుల ఒక చరుపు చరిచి ఏం పార్వతీశం భాయ్! ఇలా కొట్టుకొచ్చావేమిటి ఈ వేళప్పడు, బుద్ధిమంతులైన నీ వయసు వాళ్ళు, చదువులో మునిగి తేలుతు వుండవలసిన సమయంలో నువ్వు ఏ గుంటనో తీసుకొని సరదాగా సినిమా చూసి వస్తున్నట్టుంది నీ వాలకం . ఇలా అయితే లాభం లేదబ్బాయ్. మేమంతా పెద్దవాళ్ళం ఇక్కడున్నాం మీ బోటి వాళ్ళను, కుర్రకారుని జాగ్రత్తగా చదువుకుంటావ్ అనే నమ్మకంతో నీ మీద పర్యవేక్షణ కొంత మేం తగ్గించిన మాట వాస్తవమే. నువ్వు మా ఏమరుపాటు కనిపెట్టి ఇలా శృంగార కలాపంలో దిగుతున్నావన్నమాట. మేము కొంచెం మళ్ళీ నిన్ను జాగ్రత్తగా కనిపెట్ట వలసిన పని కల్పించావు మాకు సరే" అని నన్ను కూర్చో మన్నాడు.

ఇదంతా చూస్తే నాకు ఏమనాలో తోచలేదు. ఇంతట్లోకే ఇంకొకతను తలుపు తీసిన కుర్రాడు ఏమిటి పార్వతీశం గారూ ఇంత హడావుడి గా వచ్చారు. మీ కంగారు మీ ముఖ

వైఖరి చూస్తే నాకు చాల భయమేసింది సుమండీ అన్నాడు. ఇంతలోనే తలుపు చప్పుడు కావడం నాకు మల్లేనే ఇంకొ ' నలుగురైదుగురు లోపలికి రావడం నన్ను పలకరించినట్టుగానే మళ్ళీ రావుగారు, తదితరులు వీళ్ళని పలకరించడం వాళ్ళు

తెల్లబోయి మాట లేక పోవడం జరిగింది. అప్పటికి నేను నా కంగారు నుంచి తేరుకొని "ఏమండీ ? మీరంతా కూడ నె 'వచ్చిన పని మీద వచ్చారా? "అన్నాను.

అందులో ఒకతను అవునండీ అలాగే కనపడుతుంది. ఇంతకు అని అనబోతుంటే

" ఏమండీ రావు గారు తమకిప్పటికి పూర్తి ఆరోగ్యం కలిగినట్టైనా? పాపం తొందర పడి ప్రయాణమైన వారు మళ్ళీ మూట మూలను పెట్టైరన్నమాట. మా యోగ క్షేమాలు కనుక్కోవడానికి అబ్బ, ఎంత మంచి వారండీ మీరు!" అనగానె ' అందరు గొల్లుమన్నారు. అందరితో పాటు రావు గారు కుర్చీలో వెనక్కు పడి నవ్వుతుంటె, వారి ఉదరం ఎగిరెగిరి పడుతుంటే మేము పట్టలేక మళ్ళీ నవ్వాము. ఈ వేళ ఏప్రిల్ మొదటి తేది యేనా అయింది కాదు అన్నాడు ఒకతను. ఇంతకూ ఆ దుర్మార్గుడు, ఆ తుంటరి, ఏడీ కనపడడేమీ" ఎక్కడున్నా, కొండ చరియలలో దాగినా, సముద్ర గర్భాన నక్కినా, పైకి లాగి తుక్కు రేగ గొట్టి ఎముకలు చూర్ణం చేయవలసిందే అన్నాడు. ఒకతను ఎంతో కోపోద్రిక్తుడైన ఏ దుశ్శాసనుడు లాగానో అభినయిస్తు ,రావుగారు ఇదంతా చూచి బ్రహ్మానందభరితుడై వాళ్ళ లాండ్ లేడిని నిద్రలోనో, మరే స్థితిలోనో ఉన్నదో పాపం, పిలిచి మాకందరికి కాస్త టీ పోయించమనీ, లేకపోతే మేము ఆయనను వదిలి వెళ్ళే సూచనలు ఏమీ కనపడ్డంలేదని, మేము పోకపోతే తనకా రాత్రి నిద్ర పోయే యోగం లేదని ఎంతో దీనంగా విన్నవి ంచుకున్నాడు.

ఆమె ఎంతో కోపం వచ్చినట్టు కనపడ్డా, తుదకు నవ్వుకుంటూ అక్కడున్న మూర్తులు ఎన్నని లెక్కించుకొని వెళ్ళి, మా రావుగారన్నట్టుగా అయిదు నిమిషాల్లో

కాకపోయినా, పది నిమిషాలు దాటకుండా ఒకటో రకమైన టీ, బిస్కట్లు అందించింది. ఏం చేస్తాం! ఏదొచ్చినా, ఎవరిచ్చినా, అనుభవించక తప్పదు కదా. ఆ పని ముగించుకొని రావు గారిని సుఖ నిద్ర పొమ్మని , ఇటువంటి తెగుళ్ళు తెప్పించుకోవడం ఆరోగ్యకరం కాదని హెచ్చరించి మా దారిన మేము వెళ్ళి పోయాము. దీనిని ఆంగ్లంలో ' practical joke అంటారు.

తెల్లారిన తరవాత గోపాలకృష్ణయ్య కనపడితే అతనిని పట్టిద్దామనుకున్నాను. వారం రోజుల వరకు ఆయనెక్కడ పికరేలె 'కుండా పోయాడు బ్రతికి పోయాడు. చాల కాలం క్రితం జరిగినదే ఒక సంగతి చాల స్వల్పమైనదే చెప్పడం మరచిపోయాను. అందులో విశేషం ఏమీ లేదు కాని వూరికేనే తమాషాకి చెపుతున్నాను. నేనిక్కడకు వచ్చిన

తరువాత, నా బారసాల మహోత్సవం నాడు జరిగిన నామకరణ కాక,ఇక్కడ మళ్ళీ మంచిరోజు కాని, మహోత్సవం కాని లేకుండానే నామకరణం చేసుకోవలసి వచ్చింది.

ఇక్కడ ఆచారమేమిటంటే మనదేశంలో ప్రతివాళ్ళకు ఉన్నట్టుగానే వ్యక్తి పేరు, ఇంటి పేరు కలసి రెండు పేర్లుంటాయి. ఎటోచ్చి ఈ దేశంలో వ్యక్తి పేరు మొదలు ఇంటి పేరు చివర ఉంటుంది. మన దేశంలో వ్యక్తి పేరు చివర ఇంటి పేరు మొదలు ఉంటుంది. పైగా మన ఇంటి పేర్లన్నీ చాల వరకు ఏనాడో మన పూర్వులు నివసించిన గ్రామముల పేర్లయి ఉంటాయి. లేక మన పెద్దలు సంపాదించిన బిరుద నామములేనా అయి ఉంటాయి.

ఈ పద్ధతి మనదేశంలో కూడా మనిషి పేరు ముందు, ఇంటి పేరు వెనుకా ఉండటం కొన్ని ప్రాంతాలలో అలవాటైనని ఇక్కడున్న ఉత్తరాది విద్యార్థుల వల్ల తెలుసుకున్నాను.మన వాళ్ళలో కొంతమంది కూడ ఇక్కడకు వచ్చిన తరవాత తమ పేరు ముందు ,ఇంటి పేరు వెనకకు మళ్ళించడం చూశాను. నేను అలా చేయవలెనని మొదట అనుకోలేదు కాని, చేయక తప్పినది కాదు . ఏమంటే నా పేరు ఎవరికి చెప్పినా వాళ్ళకు మొదటి సారి అర్థం కాకపోవడమే కాక పదిసార్లు చెప్పినా వాళ్ళు ఉచ్చరించలేక నానా యాతన పడినా కుడా,పలకలేక పోయేవారు.

కొందరు నన్ను "టెసామ్" అనేవారు కొందరు "టీసమ్" అనేవారు.మరికొందరు అల్లరికి సమ్ టీ అనేవారు. మా లెండ్ లేడి వగైరా అంతా ఈ మాత్రం కూడా అనలేక సేమ్ అనేవారు. టపా బట్వాడాలో కూడా నా పేరు టపాజవానె ' ఉచ్చరించలేక, తెలుసుకోలేక నానాయాతన పడేవాడు. ఈ ఇబ్బందులన్ని ఎందుకని ఈ దేశ సమాచారం ప్రకారం ఇంటి పేరే చివరికి మారిస్తే బాగుంటందని ఆలోచించి ఆ ప్రకారం చేశాను. కాని ఆ మార్పు కుడా ఇక్కడి వాళ్ళకి వీలు కలిగించలేదు .పి.వె.మూర్ అని మార్చుకున్నాను.

అయినా అది కూడా వాళ్ళు వెమార్ అని కొందరు.మోర్ వే అని కొందరు మూర్ అని రకరకాల రూపాలు కల్పించటం మొదలెట్టరు. ఈ కర్ణ కఠోరమయిన శబ్దాలు వినలేక

బాధ పడి కొంచెం ఆలోచించి మళ్ళీ ఒక చిన్న మార్పు చేశాను. ఇంటి పేరు ఇది వరకు ఇంగ్లీషులో vemur అని వ్రాసే వాణ్ణి ఇప్పుడు దానిలో కూడా ఒక చిన్న మార్పు చేస్తే బాగుంటందని p.v. more అని మార్చుకున్నాను . దానివల్ల మళ్ళీ కొన్ని ఇబ్బందులు వచ్చాయి. కొందరు మర్ మర్ అని ఈ మర్ ఏమిటండి అని కొందరు అడగటం

మొదలెట్టరు.అందుకని ఈ సారి మూర్కి వర్ణ క్రమం కొంచెం మార్చాను .mor అని ఈసారి అంతా సాఫీగా నడుస్తుందనుకున్నాను. కాని అదేం జరగలేదు. వేమూర్ అనే మాట తలలో ఆడుతుండటం మూలాన్ని veమానేసి మూర్ అంటారని సంబరపడ్డాను కాని more అనేది ఇంగ్లీషులో మోర్ అవుతుందన్న సంగతి మర్చిపోయాను ।అక్కడ నుంచి కొందరు so you are no more what more అనిmister more we will be sorry when you are no more అని నన్నాట పట్టించారు.

దాని తల్లి సిగగొయ్యా ఎటు చూసినా ఇబ్బందే కలుగుతుంది. ఇదంతా మనం మంచి రోజు చూసుకోకుండా విఘ్నేశ్వర పూజ చేయకుండ నామకరణం చేసుకోవడం వలన వచ్చిన ఇబ్బంది అనుకుంటాను. అని ఆలోచిస్తు ఒక రాత్రంతా గడిపాను. మరునాడు లేచి విశ్వ విద్యాలయానికి వెడుతు ఒక పుస్తకం కావలసి పుస్తక విక్రయ శాలకు వెళ్ళి

నాక్కావలసిన కవితా సంకలనం కోసం వెతుకుతుంటే థామస్ మూర్ అని కవి గారి కావ్యం కనపడ్డది.

ఆ పుస్తకం చూదామని పైకి తీయ గానే పుటలు తిప్పకుండానే నామకరణం ఎలా చేసుకొంటే పేచీ లేకుండ ఉంటుందో ఈ పుస్తకం మీద పేరు చూడటంతోనే హఠాత్తుగా స్ఫురించింది, నాక్కావలసిన పుస్తకం తీసుకొని ఒక క్షణం కూడ అగకుండా తిన్నగా అచ్చు ఆఫీసుకు తీసుకు వెళ్ళి p.v.moor అని నా పేరు అచ్చు కార్డు లు వేయించుకు వచ్చాను. అది నా మిత్రులకు చూపించాను. వారందరు

ఈ మాటు బాగుంది అని వారి ఆమోదం తెలిపారు. ఇటువంటి మార్పులు ఒక్కోక్కప్పడు లాభిస్తాయని కుడా కొ ంతకాలానికి తెలుసుకున్నాను.

లాభం మాట ఎలా ఉన్నా ఇప్పడందరు ఇక్కడి వాళ్ళు,మన వాళ్ళు, కూడా ఉచ్చరించగలుగుతున్నారు. ఉత్తరాలు ఏ పే ఎచీ లేకుండా సకాలంలో చేరుతున్నాయి.

ఈ మధ్యను ఒక చిన్న తమాషా జరిగింది. మరేం లేదు ,ఒక కుర్రాడిని వెర్రి వాణ్ణి చేసి ఒక పూట ఏడిపించాం అందరం కలసి. అయినా ఈ స్వల్ప విషయానికి అబద్ధం ఎందుకు? అదంతా ఏర్పాటు చేసింది అల్లరి చేసింది నేనేనని చెప్పుకో వడానికి గర్వపడుతున్నానో, సిగ్గుపడుతున్నానో చెప్పలేకుండా ఉన్నాను. మనకు చేతనైనది అదే కదా. మన కంటె కొ ంచెం తెలివి తక్కువ వాడు అంటె అందరికి సరదా. ఆ

క్షణంలో ఒకప్పుడు మరొకరు మన్ని ఇలాగే ఏడిపించారన్న సంగతి మరచి పోతుంటాం.

సుమారు ఒక సంవత్సరం అవుతుంది మన వేపు నుంచే ఒక కుర్రాడు, చాల బుద్ధిమంతుడు, చాల అమాయకుడు, మా అందరికి మల్లేనే ఇంట్లో చెప్పకుండ మంచి రోజు చూసో, చూడకుండానో ఇక్కడికి చక్కా వచ్చేడు నేను వచ్చినప్పడు, రాజు నాకుతగిలి నట్టుగానే నేను ఈ కుర్రవాడికి ఆపద్బాంధవుడిలా దొరికేను. అతనికి నా గదికి దగ్గరలోనే ఒక గది కూడా కుదిర్చి పెట్టి అతనికవసరమైన సహాయం చేస్తుండేవాడిని.

పాపం అతనికి నేనంటే ఎంతో గురి, గౌరవం ఏర్పడ్డదో చెప్పశక్యం కాదు. అంత ఇదికి కారణం ఏమీ కనిపించదు. మేము కలుసుకున్న వేళా విశేషం అనుకొని సరిపెట్టుకునే వాళ్ళం. అతను పాపం నా దగ్గర ఏ దాపరికం లేకుండ సమస్తమూ నాతో చెబుతూ ఉండేవాడు. నాతో అన్న మాటేమిటి? ఎవరితోనైనా చెప్పుకునేవాడు అనుకుంటాను. అతని స్వభావమది. వాళ్ళు గోదావరి జిల్లావాళ్ళు. సంపన్నులు, భూస్వాములు. ముగ్గురు అన్నదమ్ములలోను ఇతను కడసారపు వాడు. పడమటి గాలికి ఇలా కొట్టుకొచ్చి,ఇక్కడ స్థిర పడి చదువు ప్రారంభించేడు.

అతనికి నేను చేస్తున్న పనే చేయమని అనగా M.A బారిస్టర్ చదవమని సలహా ఇచ్చాను. అందుకంగీకరించి వి ద్యాలయంలో చేరాడు। అప్పటి నుంచి కులాసాగా కాలం గడుస్తోంది. మా మైత్రి ఎక్కువవుతుంది. ఒక రోజున ఇతని పే ఎరుతో ఒక కవరు, చుట్టు పసుపు రాసి ఇతని చిరునామాతో ఇండియన్ అసోషియన్కి వచ్చింది నేనా రోజు పెందాలాడె ' అసోషియన్‌కి వెళ్ళేసరికి ఈ ఉత్తరం కనపడింది. ఆ ఉత్తరం చూసి ఏదో

పెళ్ళి శుభలేఖ అయి వుంటుందని మన ఆచారం తలుచుకొని ఉత్తరం జేబులో పెట్టుకున్నాను నా స్నేహితుడు రమణ కిద్దామని.

తర్వాత ఆ మాట మర్చి పోయి, నేను కొంత సేపు అక్కడ గ్రంథాలయంలో కాలక్షేపం చేసి ఆ తర్వాత విశ్వవి ద్యాలయానికి వెళ్ళి అక్కడ క్లాసులు అయిపోగానే ఇంటికి వచ్చేశాను. నా భోజనాదికములు ముగించుకొని మధ్యాహ్నం తరగతులకు వెళ్ళి వచ్చేను. ఇంత సేపు ఈ ఉత్తరం సంగతే మర్చిపోయాను.అప్పుడు హఠాత్తుగా ఇది జ్ఞాపకం వచ్చి నాలుక కరచుకొని తిన్నగా మా స్నేహితుడి గదికి వెళ్ళి బయటకి వెళ్ళడానికి తయారైన రమణ ను కూర్చో పెట్టి "నీకో శుభ వార్త తీసుకువచ్చేను" మీ ఇంట్లో ఎవరికో పెళ్ళట, నీవు ఒక మాటు వెళ్ళి ఆ శుభ కార్యం జరిపించి వస్తావా ఏమిటి అన్నాను. అతను తెల్ల బోయి అదేమిటండి ఇప్పుడు పెళ్ళి కావలసిన వారు లేరుగా మాఇంట్లో. ఆఖరు వాడిని నాక్కూడా పెళ్ళి అయిపోయిందే అన్నాడు చటుక్కన నోరు జారి.

"యేమిటి చెప్పావు గాదు ఇన్నాళ్ళు నుంచిని"

" మీరు రైటేనండీ, ఇందులో నేను చేసేదేముంది. మా వాళ్ళు పెళ్ళి చేశారు నేనా సంగతి మర్చిపోయి తిన్నగా ఇక్కడికి చక్కా వచ్చాను. మీరు కనపడ్డారు దేవుళ్ళ లాగా,మీతో చెప్పడం మర్చిపోయాను. పొరపాటేనండీ కాని దురుద్దేశం ఏమి లేదు" అన్నాడు. వెర్రి మోహము వేసికొని.

"మరైతే ఈ శుభలేఖ ఏమిటన్నాను. ఈ ఉత్తరం అందిస్తు- ఇది ఈ వేళ వచ్చింది. ఉదయాన్నే నీకు త్వరగా అందచేద్దామనుకొని తీసుకొని ఇప్పటివరకు ఇవ్వడం మర్చపోయాను యేమి అనుకోకు." అన్నాను.

అతను ఆదుర్దాలో ఉత్తరం అందుకొని చింపి చూసి ఉలుకు పలుకు లేకుండా పరధ్యానంగా కూర్చున్నాడు. శుభలేఖ చూసి ఎందుకలా పరధ్యానంగా ఉన్నాడో , ఎందుకు సంతోషంతో లేడో అర్థం కాలేదు.

ఒక క్షణం కూర్చోని "యేం రమణ, యేమిటలా కూర్చోన్నావు.ఇంతకు పెళ్ళీ ఎవరికి?। నువ్వు ఇప్పుడే అక్కడికి

వెళ్ళక్కరలేదులే. అంతలా కంగారు పడతావెందుకు అన్నాను.

"కంగారు కాదండి .పెళ్ళేం కాదండి మీకెలా చెప్పాలో నాకర్థం కావటం లేదండీ నాకు.

"మా నాన్న ఈ ఉత్తరం రాశాడ"ని నాకందించేడు. నేను ఉత్తరం అందుకొని యేమిటి విచిత్రం అని ఆశ్చర్య పోతు గబ గబ ఉత్తరం చదివేను,పెళ్ళీ కాదు, పెటాకులు కాదు .మా రమణ భార్య చి || సౌభాగ్య వతి సత్యవతి రజస్వల అయిందట. నక్షత్రం కొంచెం దోష యుక్తమగుట చేత శాంతి చేసుకోవలసి ఉంటుందని ఒక్క వారం రోజులు సెలవు పెట్టి ఇతన్ని వెంటనే ఇంటికి రమ్మని వాళ్ళ నాన్న వ్రాసిన శుభలేఖ సారాంశం. నాకు విపరీతమైన నవ్వు వచ్చింది.ఇంకేనేం ఇది మరీ బాగుంది ? పెళ్ళి కంటే ఎక్కువ సంతోషకరమైన వార్త కాదా నీకు. ఇది చూడగానే ఆ సంతోషంలో తరువాత కార్యక్రమం ఊహించుకుంటూ ఉన్నావన్న మాట." నీ పరధ్యానానికి కారణం అర్ధమైంది .బాగుంది శభస్య శీఘ్రం అన్నారు." ప్రయాణానికి ముహుర్తం ఇప్పుడే చూడమన్నావా? మళ్ళీ అప్పుడో ' మాటు మీ నాన్న రమ్మని వ్రాయకుండా ఆ తరువాయి కూడా ఇప్పుడే తీర్చుకొచ్చేస్తే అందరు సంతోషిస్తారు. కొంత ఖర్చు కలిసి వస్తుంది" అన్నాను.

అతనెంతో జాలిగా ముఖం పెట్టి "ఏమిటండీ గురువు గారు? మీరు కూడా నన్ను ఇలా ఏడిపిస్తే ఎలాగు మానాన్న అసలు ఈ ఉత్తరం రాయడం ఎందుకు? వారం రోజులు సెలవు పెట్టి రావాలట .ఆ వారం రోజులలోను సమస్తం సర్దుబాటు చేసుకొని తిరిగి వెళ్ళిపోవచ్చునట.యెంత వెర్రి వాళ్ళో మనవాళ్ళు నేను ఇక్కడికి చేరడానికి నెలరోజులు పట్టిందన్న విషయం మర్చి పోయాడు మా నాన్న పాపం " అంటూ సగ్రుని ఉత్తరం చింపేయబోతుంటే నేను ఆపి ఆ ఉత్తరం లాక్కొని " శుభలేఖలెప్పుడు చింపేయ్యకూడదోయ్ అలా ఉంచు, లేకపోతే నేను జాగర్త పెడతాలే . నా స్వీయ చరిత్ర భవిషత్తులో వ్రాసేటప్పుడు ఈ రికార్డు వుండద్దా మరి." అన్నాను. అతనేమి అనలేక తల వంచుకొని కూరొ ్చన్నాడు సిగ్గుపడుతూ,తనే రజస్వల అయినట్టు.

నేను నవ్వుతూ " మళ్ళీ కలుసు కుందాం నువ్వు యెక్కడికో బయలు దేరుతుంటే నీ ప్రయాణానికి అడ్డు వచ్చాను. అయితే ఇప్పుడు మనదేశానికి నీ ప్రయాణం లేదన్న మాటే కదా?" అని అతనుకేసి చూడకుండ ముందుకు అడుగు వె ' శాను. అతను వెనుక నుంచి," అది మీరు నిర్ణయించవలసిన విషయం మా నాన్న మాట కొట్టెయగలనుగాని మీ ఆజ్ఞ శిరసావహించవలసిందే గదా? అన్నాడు. " సరే అయితే నేనాలోచించి నా నిర్ణయం త్వరలోనే తెలియపరుస్తాలే " అని చక్కా పోయాను.

నేను యెక్కడికో వెళ్ళవలెననుకున్న ప్రయాణం కట్టిపెట్టి తిన్నగా బ్రైంద్ హిల్స్‌కు వెళ్ళి కాసేపు ఒంటరిగా గాల్ఫ్ ఆడుకొని పర ధ్యానంగా ఒకచోట కూర్చొన్నాను .

ఇంతలో మెరుపులా ఒక ఆలోచన తోచింది. అది మరో మాటు మరో మాటూ ఆలోచించిన కొద్దీ చాల అద్భుతంగా అందరికి ఆశ్చర్య జనకంగాను, ఉత్సాహంగాను వుంటుంది అని ఆలోచన తోచింది. వెంటనే ఆ ప్రయత్నం రెండో కంటి వాడికి తెలియకుండా అమలు పరచవలెనని నిశ్చయంతో నాలో నేను నవ్వుకుంటూ గాలిలో తేలిపోతున్నంత ఉత్సాహంతో ,వేగంతో ఇంటికి చేరుకున్నాను.

మరునాడు స్నేహితులకు , మన తెలుగు వాళ్ళందరికు ఆ సాయం కాలం, నా గదిలో తేనీటి విందుకు దయచె
 యవలసిందిగా సవినయంగా ప్రార్థిస్తు ఆహ్వానాలు టైపు చేయించి ఆప్తులైన పది పన్నెండుగురికి అందచేశాను. నేను ఆ కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నుడనై చాల హడావుడిగా రోజంతా గడిపాను. మిత్రులకు సరదాగా వుంటుందని కొంచెం పులిహోర కూడ స్వహస్తాలతో తయారు చేశాను.ఒక స్వీటు కూడతయారు చేసి షాపులో
 నుండి రెండు రకాల కేకులు,బిస్కట్లు కూడ తీసుకు వచ్చాను.

ఈ హడావిడంతా చూచి మా ఇంటి ఆవిడ తెల్ల బోయి, "ఏమిటండి సేమ్ గారు ఇంత హడావుడి చేస్తున్నారు. మీ కె
 మైనా పెళ్ళి తలపెట్టుకున్నారా, లేక డర్బీ పందాల్లో డబ్బు గెలుచుకున్నారా? చెప్పండీ... మేము సంతోషిస్తాం" అన్నది. నా పెళ్ళీ కాదు ,నీ కార్యం కాదు, అన్నాను తెలుగులో వాట్? వాట్? ఏమీటి? యేమిటది అంది ఆవిడ కంగారుగా-" సాయంత్రం మీకు తెలుస్తుందిలే "అన్నాను.

సాయం కాలం సరిగా నాలుగయ్యేసరికి మా మిత్రబృందం ఈ పార్టీ యేమీటో, ఎందుకో తెలుసుకుందామని ఆదుర్దా. ఒక క్షణం అటూ ఇటూ పోనివ్వకుండా చక్కా వచ్చారు. వీళ్ళందరి కంటే ముందే మా రమణ కూడా వచ్చి " యేవి
 ుటండి గురువు గారు, ఈ హడావుడంతా" అన్నాడు నాతో అన్ని సర్దుతూ నేను తయారు చేసిన కాఫీ తప్ప, తక్కిన వన్నీ బల్ల మీద అమర్చడం ,అందరు ఆరగించడం అయిపోయిన తరువాతను తీపి వుండలు వున్న పళ్ళెం తీసుకొచ్చి బల్ల మీద పెట్టి , నేను లేచి నిలబడి, "సోదరులారా ! ఈ హడావుడి ,ఈ పార్టీ యెందుకని మీరు ఆశ్చర్య పోతు వుంటారు. ఇంతసేపు చెప్పకుండా మిమ్మలను ఆశ్చర్య నిమగ్నులను చేయడం అట్టె అంత న్యాయం కాకపోయినా దీని వల్ల వచ్చిన ఇబ్బందేమీ లేదు కదా అని ఇలా చేశాను. మీరు మన్నిస్తారనే ధైర్యం తో ఇప్పటికైనా చెప్పకపోతే, ఎప్పటికీ నన్ను మన్నించకపోవడమే కాకుండా యేదైనా అఘాయత్యం కుడా చేస్తారేమో అనే భీతితో అసలు రహస్యం బయటపెట్ట సాహసిస్తున్నాను .

మొన్న ఈ శుభలేఖ వచ్చిందని రమణకు వచ్చిన ఉత్తరం పైకి తీశాను. అతను నిర్ఘాంత పోయాడు ."ఇక్కడ మన వి
 ుత్రులలో నూతనంగా అంటే కొలది కాలం క్రితం వివాహమైన యువమిత్రుడు ఒకడున్నాడు. అతని భార్య ప్రధమ రజస్వల అయినట్లు ఈ శుభలేఖ వచ్చింది. ఈ పాటికి ఆమె రుతుస్నానం అయి వుంటుంది. టపా ఏర్పాట్లు సక్రమంగా లేక పోవడం మూలాన మనక్కొంచెం ఆలస్యంగా ఈ వార్త అందింది. అక్కడ పేరంట్రాండకు పంక్తి భోజనం వగైరాలన్ని అయ్యే ఉంటాయి. ఈ శుభ సమయంలో వరుడు కూడా అక్కడ వుండి వుంటే ఏంతో ఉత్సాహంగా ఆనందంగా వుండవలసినవాడు, ఏకాకిగా ఈ పురుష పుంగవుల మధ్యను చిక్కు పడి సిగ్గుతో , వ్యధతో కుమిలిపోతున్నాడు.

అతనిని ఉత్సాహ పరచడం బాధ్యత మనమీదను ఉన్నదనుకొని ,అతనిని వుత్సాహపరిచే కార్యభారం నా మీద వేసుకొ ని,మిమ్మలందరును ఇక్కడికి ఆహ్వానించాను. మీరు నాతో పాటు సంతోషిస్తు ప్రధమ రజస్వల అయిన కన్యను ఆశ్వీరదిస్తారని ఆశిస్తున్నాను. ప్రత్యేకించి ఈ సమయంలో యే పిండివంట వున్నా లేక పోయినా మిమ్మల్ని ముఖ్యంగా ముత్తైదువులకు పంచి పెట్ట వలెనని మన పెద్దలంటారు. అందుకని ఇక్కడ కనపడే స్త్రీ జాతిలో ముండెవరొ
 ,ముత్తైదువెవరో తెలుసుకోవడం కష్టం కనుక ఆ జాతి వారిని ఆహ్వానించక పోవడమే మంచిదనుకున్నాను. అందుకని ఈ కొద్ది క్షణాలు మీరే ముత్తైదువులుగా భావించకుంటె ఇక్కడ వున్న వరుడు వదువుగా కొంచెం సిగ్గు పడుతున్నా వి

ఒకందరకు చిమ్మిలి ప్రత్యామ్నాయంగా యి తీపితో మీ అందరి నోళ్ళు తీయపరచగలడు లే రమణా" అన్నాను.

అతను అదివరకే సిగ్గుతో ముడుచుకొని ముద్దయిపోయి వున్న మనిషి యీ పిలుపుతో మరి కుంగీ పోయి, నీళ్ళు కారిపోయి, లేవలేక పోతుంటె నేను జాలి పడి, అతనిని నెమ్మదిగా లేవదీసి, ఆ పళ్ళెం మంగళ హారతి పళ్ళెం లాగా వెఏమిద్దరం పట్టు కొని అందరికి తలో వుండా పంచి పెట్టాం."మా పప్పు ఇక్కడ లభ్యం కాని కారణం చేత, బాదం పప్పుతో యీ చిమ్మిలి తయారు చేయడం అయినది" అన్నాను.

సభికులు హర్షామోద కరతాళ ధ్వనుల మధ్య పార్టీ బ్రహ్మాండంగా వున్నదని ,దానికి చరిత్రలో ఒక ప్రత్యేకత ,విశిష్టత, వుండి తీరుతుందని, ఇది చాల ఒరిజినల్ ఐడియా అనీ మిత్రులందరు శ్లాఘించి, రమణ వీపు తట్టి" తరవాత కార్యక్రమం త్వరలోనే జరిపిస్తారు పార్వతీశం గారు భయపడవద్ద"ని ఆశీర్వదించి ,అభయమిచ్చి, యెవరి దారిన వాళ్ళూ చక్కా పోయారు.

నేనూ, మా రమణ మిగిలాం. అతనికి కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

" గురువు గారు ఇది మీకు ధర్మమేనా" అన్నాడు. యెంతో జాలిగా." ఓయి వెర్రి వాడా ఇందులో అధర్మం ఏమీ లేదు , నీ మీద వుండే ఆదరణ, అభిమానం మాత్రమే దానికి కారణం. నాకే కాక ఈ వచ్చిన వాళ్ళందరికి కూడా నామీద యెంత అభిమానమో, నీ మీదను కూడా అంత అభిమానం కలవాళ్ళే। అందు చేతను నీవేమి అనుకోవద్దు." అని నేను ఓదార్చేను. అతను నన్ను కౌగలించుకొని,ఆనంద బాష్పములతో మాట రాక ఉక్కిరి బిక్కిరై ,కరచాలనం చేసి నమస్కారం చేసి మాట్లడకుండా వెళ్లిపోయాడు.

అతను బయటకి వెళ్ళడం తడవుగా మా ఇంటి యజమానురాలు కూతుళ్ళు ఒక్క పరుగున నా గది లోకి చక్కా వచ్చి " ఏమిటి సేంగారు ఏమిటి విశేషం .మీరు చెప్పాలి

తప్పదు.మేము ఇందాకటనుంచి ఊపిరి బిగపట్టుకొని కూర్చోన్నాం " అన్నారు." సరే , అయితే కూర్చోండి" అని ఖర్చు కాగా ఉన్న కేకులు ,బిస్కట్లు, నేను తయారు చేసిన వంటకం ముందు పెట్టి మొహమాట పడకుండా తీసుకోమని హెచ్చరించి, అప్పుడు సావకాశంగా మా దేశ ఆచారాలు, ప్రకృతి సహజమయిన స్త్రీ లలో ఈ పరిణామానికి

మా వాళ్ళూ చేసే హడావుడి ,అంతా వివరంగా చెప్పి వాళ్ళ నాశ్చర్యచకితులను చేశాను. వాళ్ళు ఇదంతా విని నవ్వుకుంటూ వెళ్ళారు. గుమ్మం దగ్గర ఆ చిన్నపిల్ల వెనక్కి తిరిగి,నన్ను చూసి నవ్వింది.యెం " నీక్కూడా యేమన్నా అనుమానంగా ఉందాయేమిటి" అన్నాను. సమాధానం లేకుండా ఒక్క పరుగున వాళ్ళ గదిలోకి వెళ్ళిపోయింది.

వచ్చేవారం మరోభాగం

## 35వ భాగం

యుద్ధంలో జయాపజయాలు ఎవరివవుతవో నిర్ణయించడం మాట యెలా వున్నా ఊహించడము కూడా యెవరికీ సాధ్యం కానట్టు తోస్తోంది. జయము యెవరిదైనా ఆంగ్లేయులది మాత్రము కాదన్న సందేహం చాలామందికి కలుగుతున్నది . యుద్ధరంగాలలో అనేక చోట్ల అనేక విపరీత పరిణామాలు ఆంగ్లేయులు ఎదుర్కోవలసి వచ్చింది. టర్కీ ప్రాంతాల్లో, మొదట స్కాట్లండులో ఆనాడు జరిగిన నౌకభంగం కంటే ఘోర పరాజయం మళ్ళీ అనుభవించవలసి వచ్చింది. ఆ కారణం చేతను నౌకా శాఖకు ఆనాడు మంత్రిగా వున్న (First lord of the admirality)

విన్‌స్టన్ చర్చిల్ అనే ఆయన ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చింది. మొత్తం యుద్ధతంత్ర నిర్వహణ ఏమీ బాగాలేదని అనేక ఆక్షేపణలు రాగా ప్రధానమంత్రియైన యాస్క్విత్ అనే ఆయన కూడా ప్రధానమంత్రి పదవిలో నుంచి తొ లగవలసి వచ్చింది. ఆ సందర్భంలోనేననుకుంటాను రాజకీయ పార్టీలు ఎన్నికలకు దిగవలసి వచ్చింది.

అది వరకు యాస్క్విత్ పార్టీ లోనే ఉంటున్న లాయిడ్ అనే ఆయనకు ప్రత్యర్థిగా బ్రహ్మాండమైన ప్రచారం సాగించడం మొదలెట్టారు. ఇటువంటి ప్రచారములు యెప్పుడు ఇంతకి పూర్వము చూడలేదు. దానిని గురించి విశేషంగా చదవను కూడా లేదు. లాయిడ్ జార్జీ గారి ప్రసంగం వినవలెననే కుతుహలముతో మాకు దగ్గరలో వున్న గ్లాసిగో అనే పట్టణానికి కొందరి మిత్రులతో కలసి వెళ్ళాను. లోగడ యెడింబరోలో నాడు యాస్క్విత్ గారి సభ కంటె మరీ బ్రహ్మాండంగా ఏర్పాటు కాబడిన సభ ఇది. ఒక హాలులో కాక ఒక విశాలమైన బహిరంగ ప్రదేశంలో ఏర్పాటు చేయబడిన సభ ఇది. జనం అసంఖ్యాకంగా వచ్చారు.

ఇన్ని వేలని చెప్పశక్యం కాకుండా వున్నది. మేము వచ్చిన కొద్ది నిమిషములలోనే సభ ప్రారంభ మైనది. సభాధ్యక్షులు కొన్ని నిమిషములు ప్రసంగించి జార్జి గారిని ఉపన్యసించమని కోరారు. ఆ దేశస్తుల పరిమాణాలను బట్టి ఆయన కొంచెం కురచని చెప్పాలి. తెల్లని మీసములు వెనుక నుంచి ఆయన మందహాసం కనిపిస్తుంది. ఆయన లేవగానే సభంతా నిశబ్దమైంది. చీమ చిటుక్కుమన్నా వినపడేటంత నిశ్శబ్దం. ఆయన ఉపన్యాసం మహా ప్రవాహంగా సాగిపోతున్నది. ఆయన వాక్కు సింహ గర్జనలా

మ్రోగుతు ఎంతదూరానికో వినిపించింది. ఆయన ఉపన్యాసం మధ్యన ఆ నాటి పరిస్థితులను ప్రజల ఆశయాలను చెప్పడంలో " దూరాన వున్న ఇండియా హోమ్ రోల్ ఇవ్వక తప్పదంటున్నది. మా వేల్స్‌కి కూడా హోమ్ రూల్ ఇవ్వక తప్పదంటున్నది. అనగానే అంతవరకు నిశబ్దంగా వింటూన్న శ్రోతల మధ్య నుంచి ఒకడు లేచి హోమ్ రూల్ ఫర్ హెల్ అని ఉరుములా, సభంతా దద్దరిల్లేటట్టు పెద్ద కేక పెట్టేడు. దానితో సభలో పెద్ద గందర గోళం బయలు దేరింది.

అనేక మంది ఈ రౌడీని, ఈ దుర్మార్గుణ్ణి, ఈ నీచుణ్ణి, ఈ శత్రు పక్షంవాణ్ణి అవతల కీడ్చేయండి. బయటకి తన్ని తగలె 'యండి అంటూ కొన్ని వేల కంఠాలు వినపడ్డాయి. ఇంతటితో సభ ఆపి వేయవలసి వస్తుందేమోనని చాల మంది భయపడ్డారు. అందరు లేచి నిలబడ్డారు. అధ్యక్షుడు సభను సముదాయించలేకపోయారు. అప్పుడు లాయడ్ జార్జీ గారు మహాజనులారా! ఒక్క క్షణం ఓపిక పట్టండి. ఎందుకు మీరింత ఉద్రిక్తులవుతున్నారు .ఆ పెద్ద మనిషి అన్న దానిలో తప్పే

ప్పముంది. మీకింత ఆగ్రహావేశములు ఎందుకు? ఆయన రాష్టానికి ఏకైక ప్రతినిధిగా వచ్చి వారికి స్వరాజ్యం కోరడంలో
తప్పేమున్నది. నా మటుకు సబబుగా కనిపిస్తోంది. అని ఆ అల్లరి చేసిన మనిషి వైపు తిరిగి

"అయ్యా! మీరు చెప్పిన విషయం తప్పకుండా ఆలోచించదగ్గదే. ఇంక తరవాత సంగతి " అని ఉపన్యాసం పున: ప్రారంభించబోతుంటె సభలో నున్న వారంతా కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతు, ఆకాశం కూడా దద్దరిల్లేటట్టు నవ్వుతు కరతాళ ధ్వనులు చేశారు. మరొక అరగంట సేపు వారి ఉపన్యాసం ఏ అడ్డంకి లేకుండా సాగిపోయింది. ఆ అల్లరి చేసిన మనిషి ఏమయ్యాడో అంతు లేదు. ఇటువంటి సభ మళ్ళీ యెప్పుడు చూడగలుగుతాననుకోను.

ఉపన్యాసకుడు ఎంతటి వాడైనా వాక్ప్రవాహానికి ఇటువంటి అడ్డు తగిలినప్పుడు అంత ప్రశాంతంగా, అంత సౌమ్యంగా దెబ్బ తీసే వాడికి కూడా బాధ తెలియకుండా చెప్పు దెబ్బ కొట్టడం ఎంతటి వాళ్ళకో గాని సాధ్యం కాదనుకుంటాను. ఇంటికి వెడుతూ ఆయన చమత్కార ప్రయోగాన్ని గురించే ఆలోచిస్తు మళ్ళీ ఎడింబరో చేరుకున్నాను. తుదకు ఎన్నికలలో, ఇంగ్లాడులో అద్వితీయుడని పేరుగన్న యాస్క్విత్ పరాజితుడు కావటం లాయడ్ జార్జి ఆ స్థానం ఆక్రవి ంచుకోడం విధి వైపరీత్యం .

యుద్ధం నానాటికి భయంకర రాక్షసకృతిలా తయారై ప్రపంచాన్ని దద్దరిల్ల చేస్తోంది .

నేలమీద యుద్ధంకన్నా, సముద్రం లోను, గాలిలోను జరుగుతున్న యుద్ధం మరీ భయంకరంగా ఉంది. ఏనాడు పగలు వి
ధిలోకెళ్లిన వాళ్ళు మర్నాడు ఉదయాన్నే లేచి బయటకు వస్తారో లేకపోతే దీర్ఘ నిద్రలో పక్కలోనే ఉండిపోతారో
చెప్పటం కష్టంలా ఉంది. అహర్నిశాదులు ఆకాశంలో మనవో, శత్రువులవో తెలియకుండ విమానాల రొదతో

చెవులు గింగురుమంటూ గుండెలు జల్లుమంటూ భీతావహంగానే రోజులు గడపవలసి వస్తుంది. బజారులో నిత్యావసర వస్తువులు కూడా దొరకడం దుర్లభమవుతుంది. ధరలు విమానాలతో పాటు అంతరిక్షానికెగురుతున్నాయి.

తెల్లవారి పత్రికలు తెరిచేసరికి జర్మనులు కొన్ని వందల గ్రామాలు ఆక్రమించుకొన్నారనో, కొన్ని వూళ్ళు విధ్వంసం చె
శారనో, ఎక్కడో దూర తీరాల్లో తమ జలాంతర్గాములతో కొన్ని ఓడలు ముంచి వేశారనో, విమానాల నుంచి కొన్ని పట్టణముల మీద కొన్ని వందల బాంబులు పడేశారనో, కొన్ని వేల మంది సైనికులో, నావికులో, సామాన్య పౌరులో
నిహతులయ్యారనో వార్తలు తప్ప మరేమి కనపడేది కాదు.

ఎప్పడూ ఫిరంగుల మోతో, బాంబుల ప్రేలుడో చప్పళ్ళో తప్ప మరొక శబ్దం వినపడడం లేదంటే అతిశయోక్తి కాదు. ప్రతి నిత్యం,ప్రతి క్షణం ప్రాణములరచేతిలో పెట్టుకొని భీతావహులై ప్రజలు కాలం గడుపుకోడం చాల ఆశ్చర్యంగా ఉన్నది. ఇటువంటి దుర్భర భయంకర భీతావహస్థితి అనూహ్యం. ఇదివరకెప్పుడు ప్రపంచమంతకు ఏకకాలమందు ఇటువంటి అనుభవం వచ్చిందని విని కూడా ఎరుగం.

చిత్రమేమిటంటే ఇంత దుర్భర భయంకర స్థితి లోను జనం ఈ విచిత్ర పరిణామానికి అలవాటు పడి ప్రతి నిత్యము, ప్రతి క్షణమూ తమను మృత్యువు వెంటాడుతున్న సంగతి కూడా విస్మరించి, నిర్భయంగా ఉన్నట్టే కనుపడుతూ ఏ వి

షవాయువో, ఏ తుఫానో హఠాత్తుగా వచ్చి ప్రజలను కొంత భయ భ్రాంతులను చేసినా దాని దారినది పోయినట్టుగానే, ఈ యుద్ధం కూడా నేడో రేపో పోక మానదు.

అంతిమ విజయం మనం సాధించకపోము అనే నిశ్చయంతో ఎవరికి వారు ధైర్యము చెప్పుకొన్నట్టు కాలక్షేపం చేసుకో ్వడం చూస్తే చాలా ఆశ్చర్యంగా ఉన్నది .ఎవరి మట్టుకు వారు వారి దైనందిన కార్యక్రమం మార్పులేకుండా సాధ్యమైనంతలో జరుపుకుంటూనే ఉన్నారు. అన్ని మాములుగానే జరుగుతున్నాయి. ఎటొచ్చీ శత్రుసంహారానికి దో ్హదం చేయగలిగినవి ప్రజలకు మనోధైర్యం కలిగించేవి,

యువకులను యుద్ధమునకు పురి కొల్పేవీ, ఈ సంబంధమైన నాటకములు, పాటలు ఎక్కువగా ప్రదర్శించబడడం గమనించవలసిన విషయం. దేశాభిమానమును పురికొల్పే ఈ నాటకాలు ఎన్ని రకాలుగా బయలు దేరేవో లెక్కలేదు.

ఇక మాములు అలవాటు ప్రకారం సాయంకాలం తమ దైనిక కార్యక్రమములు ముగియగానే యువతీ యువకులు ఎంత చీకటిగా ఉన్నా, వీధులలో దీపాలు లేకున్నా, వాహ్యాళికి వెళ్ళడం మానుకోలేదు. ఈ చీకట్లో అట్టె దూరం వెళ్ళకుండానె ్ఎక్కడికక్కడె ఆలింగచుంబనలు జరుగుతుండేవి.

ఒక రాత్రి సుమారు తొమ్మిది గంటలప్పుడు జనం రోడ్లంట తిరుగుతూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ ప్రేమికులు ఆలింగనం చేసుకొంటూ, ముద్దు పెట్టుకునే సమయంలో శత్రు విమానాలు వచ్చే సూచనగా భయంకరంగా,సైరను కూత వినపడ్డది. రోడ్డులో జనం తొందర తొందరగా గృహోన్ముఖులయ్యారు. ప్రేమికులు భయభ్రాంతులై ఆలింగలములను వీడలేక ఉత్తర క్షణంలో ఏమౌతామో అన్నట్లు మరీ దగ్గరగా ఒకరిలో ఒకరు కలిసి పోతున్నారు. ఆ క్షణంలో ఒక మేడ మీద మీంచి కిటికీ తలుపు గభాలున తెరచి ఒక వృద్ధ పురుష శిరస్సు కిటికి లోంచి ఇవతలకి వచ్చి "ఏమ్రా! మీకు బుద్ధుందా లేదా! త్వరగాఇంటికి చావకపోతే ఇక్కడే చచ్చురుకుంటారు .బ్రతికి బాగుంటె ్ఈ కౌగిలింతలు అప్పుడే పున: ప్రారంభించవచ్చు. తెలిసిందా? వినపడుతుందా? అని కేకేశాడు!

ఆ కిటికీ సమీపంలోనే తన ప్రియురాలిని కౌగిలించుకొన్న ప్రేమికుడు కౌగిలి పట్టు విడవకుండానే పైకి చూసి "తాతగారూ! దయచేసి మీ తల కాయ లోపలికి లాక్కోండి లేకపోతే మీ బట్ట తల మీద పడుతున్న చంద్ర కిరణాలు పరావర్తనమై విమానాలకు మార్గదర్శకం కాగలదు" అన్నాడు.

దారిన పోతున్న వాళ్ళు, సమీపంలో ఉన్న వాళ్ళు ఒకటే నవ్వు. ఆయనకు విపరీతమైన కోపం వచ్చి "నే వస్తున్నా ఉండండి. మీ తెగులు కుదురుస్తాను. కావరమెక్కి" అని తల లోపలకు తీసుకొని గభీమని కిటికి మూశాడు. ఆయన నిజంగానే కిందికి వస్తాడెమోనని కొందరు యువతి యువకులు తొలగనారంభించారు.

ఈ మాటాడిన యువకుని బాహు బంధాలలో ఉన్న కన్య

"ఏడిసి నట్టె ఉంది నీ తెలివి. రా! అవతలికి పోదాం. ఆయన వచ్చాడంటే మన దుంప

తెంపుతాడు. ఆయన మా నాన్న అన్న సంగతి నీవు గమనించినట్టు లేవు " అన్నది.

ఆ మాటతో హడలిపోయి "బాబోయ్ రా త్వరగా । ఏమిటంత నెమ్మదిగా అడుగు వేస్తావేం" అని ఆ కన్యక రెక్కను పట్టుకొని దడ దడ దౌడు తీశాడు.

ఇదంతా మా వీధి గుమ్మంలో నుంచుని ఆనందిస్తూ లోపలికి వెళ్ళడం మరిచేసరికి మా యజమానురాలి కూతుళ్లిద్దరు వచ్చి చెరో రెక్కా పట్టుకొని రండని లోపలికి లాక్కుపోయారు.

ఇంత భయంకరస్థితిలోను ఇంత నిర్భయంగా ఎలా బ్రతుకుతున్నారు ఈ ప్రజానీకం అనుకొని ఆశ్చర్యపోతూ ఇలా ధైర్యంగా ఉండక ఏం చేయగలరు భయపడి గుండె బేజారై చావడం కంటె ఇదీ నిత్య జీవితం లో భాగమే అనుకొని సరిపెట్టుకోవడం తదనుగుణంగా కాలక్షేపం చేసుకోవడం తప్ప మరో గత్యంతరం మేమున్నది? అనుకుంటూ కూచున్నాను.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలయ్యేసరికి ఆ సాయంకాలం ఇండియన్ అసోషియేషన్ లో ఈ అత్యవసర పరిస్థితులను సమీక్షంచడానికి ఒక సభ జరుగుతుందని అందరు తప్పక హాజరు కావలసినదని ఒక ఆహ్వానం వచ్చింది. ఈ పిలుపు ఏమిటి, ఈ పరిస్థితుల సమీక్ష యేమిటి? దీని వలన ప్రయేజనమేమిటి? అని పరిపరి విధాల ఆలోచిస్తు సాయంకాలం సకాలంలోనే సభకు వెళ్ళాను. మిత్రులంతా కొంచెం ఇంచుమించుగా అక్కడున్న భారతీయులంతా వచ్చి హాలు నింపేశారు. అంత క్రితం రోజునే యం కె గాంధి అనే ఒకాయన లండను వచ్చారని యుద్ధ భూమిలో

దెబ్బ తిని వికలాంగులైన భారత వీరుల సహాయార్థం ఇండియన్ రెడ్ క్రాస్ సోసైటి ఒకటి ఏర్పాటు చేస్తున్నారని నిన్నటి పత్రికల్లో వార్త ప్రసారమైంది. ఇక్కడ సభలో సభాపతిగా మన గోపాలకృష్ణయ్య గారు కూర్చొని యుద్ధ పరిస్థితులు స్థూలంగా సమీక్షించి ఏ విధమైన సంబంధం లేని భారతదేశం కూడా యుద్ధంలోకి దిగి మన శక్తికి మించిన ధన ప్రాణ నష్టం చేసుకోవడం అవివేకం, అనవసరం. హాస్యస్పదమంటూ గంభీరోపన్యాసం చేశారు. ఇప్పటికైనా మనం కళ్ళు తెరచుకొని మన యదార్థ స్థితి మనం తెలుసుకొని ఈ యుద్ధంలోంచి ఎలాగోలా బయటపడటం మన ప్రధమ కర్తవ్యమని, తదనంతరం మనము మన దాస్య విముక్తి కై స్వాతంత్ర సమరం సాగించడం మన ద్వితీయ కర్తవ్యమని గంభీరోపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసంతో అక్కడున్న యువకులు చాలమంది పులకాంకితులు, ఉత్తేజితులు అయ్యారు.

తరువాత మనం ప్రస్తుత పరిస్థితులలో ఆయనెవరో గాంధీ అనే ఆయన యేర్పాటు చేస్తున్న రెడ్ క్రాస్ సొసైటిలో చేరి వారితో సహకరించవలెనా,అక్కరలేదా అనే విషయం పై చాల సేపు తీవ్ర వాదోపవాదాలు జరిగిన పిమ్మట, ఏ నిర్ణయం, తీర్మానం, లేకుండానే సభ ముగిసింది.

ఈ సమావేశం జరిగిన తరువాత ఇండియన్ అసోసియేషన్ లో కూడా వాతావరణం గంభీరంగా ఉంటూ వచ్చింది. మునుపటి వుత్సాహం, నిర్భయం అందరిలోను మృగ్యమైనాయి ఎవరిమటుకు వారు ఈ యుద్ధ భారమంతా తామే మోస్తున్నట్టు ముఖాలు పెట్టుకొని తిరగడం ఆరంభించారు. గాంధి ఆరంభించిన రెడ్ క్రాస్‌లో కూడా ఆయన అనుకున్నంత మంది, అనుకున్నంత తొందరగా చేరడం లేదని వార్తలు వస్తున్నాయి. భారతీయులంతా తప్పక విధిగా ఈ స్వచ్ఛంద సేవాదళంలో చేరడం మనకు గౌరవం ,శ్రేయస్కరం అనే హెచ్చరికలు తరచు గాంధి , పత్రికలలో ప్రచురణ

చేస్తున్నాడు.

ఇలా ఒక వారం గడిచిన తరువాత గోపాలకృష్ణయ్య గారు ఒక డజను మందిని తనకు సన్నిహితులైన ఆంధ్రులను మాత్రము తన ఇంటికి టీకి పిలిచారు. అందులో నేను కుడా ఒకడనని చెప్పుకోవటానికి గర్విస్తున్నాను. టీ, ఫలహారాలు నిశబ్దంగానే తొందరగానే ముగించాం. ఎప్పుడూ అలవాటు లేని ఈ సమావేశాన్ని ,ఈ పెద్ద మనిషి ఎందుకు ఏర్పాటు చేశాడని ఎవరి మట్టుకు వాళ్ళు ఊహాగానాలు చేస్తున్నారు. ఫలహారాలు కాగానే ఆయన గంటమోగించగానే లేండ్ లేడి వచ్చి ఈ కప్పులు వగైరా అన్ని తీసుకొని టేబుల్ శుభ్రపరచి వెళ్ళగానే గోపాలకృష్ణయ్య గారు తలుపు తాళం బిగించారు. ఇది మమ్ములందరిని ఆశ్చర్య చకితుల్ని చేసింది.

ఆయన వచ్చి కూర్చోకుండా నిలబడి ఉపోద్ఘాతేమేమి లేకుండా

"మిమ్ములను ఈనాడు ఇక్కడకు యెందుకు ఆహ్వానించానని మీరందరు ఆశ్చర్యపడుతున్నారని నాకు తెలుసు. వారం రోజుల క్రితం మన అసోసియేషన్లో అశాంతి బయలు దేరింది .ఈ యుద్ధం, దీని పరిణామము భారతదేశము లాంటి దాస్య దేశాలపై దాని ప్రభావము మనము ఊహించలేకున్నాం. ఈ పరిస్థితుల తీవ్రత మనలో ఎవ్వరిని కలత పెట్టినట్టుగా తోచటం లేదు .ఇది ఏదో గాలి వాటనీ ,తుఫాన్ లాంటిదని, ఎంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగాను పోతుందని

మనమనుకుంటూన్నాము. ఇప్పటికే, యూరపులో జరిగిన మారణ హోమము ఎంత భయంకరమైనదో మనము ఊహించలేకుండా ఉన్నాము .ఈ మారణహోమంలో మన భారతీయులను కూడా మన ప్రభువులు ఇక్కడకు రప్పించి వేల సంఖ్యలోనే లేక లక్షల సంఖ్యలోనేమో కూడా సమిధులుగా ఉపయోగించేవారు అన్న సంగతి మనకు పట్టినట్టు , లె ేదా మనం పట్టించుకున్నట్టు తోచడం లేదు.

ఇంత దూరంలో వున్న మనకు మనదేశంలో బయలుదేరిన రోదన శబ్దము మన చెవులకు వినిపించకపోవచ్చు. అంతమాత్రాన అక్కడ అంతా ప్రశాంతంగా వున్నదని మనము సంబరపడటానికి ఏంత మాత్రము వీలు లేదు నేనీ మధ్యన అనుభవిస్తున్న మనో వేదన ఇంతని చెప్పలేకపోతున్నాను.ఈ వేదన ఇతరులకు తెలిసేది కాదు.

ఇది దుర్భరం, దురూహ్యం. అందుచేతను నేనోక నిశ్చయానికి వచ్చాను. అది మీతో చెప్పి మీ సహకారము, అధమము మీ సానుభూతి అర్థించవలెనని మిమ్మల్నిక్కడకు పిలిపించాను. దేశము నన్ను పిలుస్తోంది నేను అక్కడ ఉండటం అత్యావసరమనిపిస్తోంది నేనొక్కడును ఏదో వెళ్ళి చేయగలనని కాదు .కాని నేను మటుకు ఇక్కడ ఉండలేను. నా

కర్తవ్యము అక్కడికి వెళ్ళి నిర్ణయించుకోవలసింది. ఈ చదువు ఈనాడు కాకపోతే బ్రతికి బాగుంటె మరోనాడు చదవవచ్చును .

మీలో ఎవరికైనా నాలాగే మానసిక ఆందోళన బయలు దేరి ఉంటె నాతో బయలు దేరమని నా ప్రార్ధన. నిష్కల్మషమైన సంకల్ప బలంతో,అకుంఠిత దీక్షతో మనమొకరిద్దరం బయలు దేరినా అక్కడ మన వెంట బయలు దేరేవారు కొన్ని లక్షల

మంది బయలు దేరతారని నా నమ్మకం." ఆయన మాట పూర్తి కాకుండానే బాగానే ఉన్నది కాని, ఏదో కొంచెమయినా కనీస కార్యక్రమము మీరేమైనా ఆలోచించారా అని ఒక మిత్రుడు అడిగాడు.

" బాగుంది మీరడగటం సబబే. నేను వివరాలేమి చెప్పలేను. కాని స్థూలం గా ఒక ఊహ నాకు తోస్తుంది నేను వెళ్ళి పదిమందినో వందమందినో కూడగట్టుకొని ప్రతి పట్టణం లోను వున్న పోలీసు ఠాణాలపై దాడి చేసి ,అక్కడ ఆయుధాలను సంగ్రహించి వాళ్ళను అసహాయస్థితి లో, దుర్భల స్థితిలో పెట్టవలెనని నా వుద్దేశము.

మాలో కొందరు నవ్వేరు . కొందరు మౌనం వహించారు. ఒకరిద్దరేదో అనవలెనని అనడానికి సాహసం లేక వూరుకున్నారు.నాకు కొంచెం తొందరపాటెక్కువ కనుక నేను

అనాలోచితంగా రెండు స్టేషన్ల మీద దాడి జరపగానే మూడవ స్టేషను మీదకు మీరు

వెళ్ళే అవకాశం లేకుండా మీ ఆట కట్టడుతుందన్న సంగతి మీరూహించారా? అలా జరక్కుండా దానికి ప్రతిక్రియ ఏమన్నా వూహించారా" అన్నాను .

ఆయన నాకేసి చూసి మందహాసం చేసి " భలేవాడవోయ్ , నీ మాట మర్చేపోయాను నేను. నీకు సమాధానం తరువాత చెబుతాను. కాని నువ్వూ నా తోటి రాకూడదా" అన్నారు. "చిత్తం అంత అదృష్టమా? నా పరిస్థితి నా కిటువంటి సదవకాశం కలిగిస్తుందని అనుకోలేకుండా ఉన్నాను. అయినా మీరు వెళ్ళి మీ ఉద్యమం ప్రారంభిస్తే నె ేనప్పడు పరిగెత్తుకొస్తానేమో ఇప్పుడేమి చెప్పలేను.

అయినా నన్ను మీ ప్రధమ శిష్యుడి గా లెక్క వేసుకోండి మీరు దారి తీస్తే నాకిక్కడ కాలు నిలుస్తుందనే నమ్మకం లేదు " అన్నాను ."సరే భవతు! అలాగే కానీ, మీరందరు కూడా దీన్ని గురించి కొంచెం జాగ్రత్తగా ఆలోచించి మీకు తోచిన సలహాలేవైనా నాకు చెపుతే స్వీకరించడానికి నాకేమి అభ్యంతరం లేదు. నా పిలుపు అందుకొని మీరందరు కూడా ఇక్కడికి వచ్చినందుకు చాలా సంతోషం. ఈలాగనే కొన్నాళ్ళయిన తరువాతనైనా ఈనాటి నా పిలుపుకు వలెననే మన దేశ సంరక్షణకు స్వదేశానికి కూడా పరిగెత్తుకు రాగలరని ఆశిస్తున్నాను. సెలవు అన్నారు. అందరు నిశబ్దంగా లేచి సెలవని యెవరి దారి వారు చక్కా పోయారు. వారం పది రోజులు మేము మళ్ళీ కలుసుకోలేదు.

యుద్ధం నానాటికి భయంకరమవుతున్నది. మనదేశం నుంచి ఇక్కడికి ఎవరన్నా రావలనన్నా కష్టం గానె ే వున్నది .ఇక్కడ నుంచి ఇంటికి వెళ్ళడం మరీ కష్టమైన స్థితి ఏర్పడింది. కారణమేమైనా మన గోపాలకృష్ణయ్యా గారి ప్రయాణం సాగలేదు. నా తొందరా తగ్గింది దానితో పాటు.ఇక్కడ జీవితం కొన్ని విషయాల్లో చిత్రంగాను, మన పద్దతులకు వ్యతిరేకంగాను, కనపడుతుంది. ఇక్కడ యువతీ యువకులు కాస్త వయస్సు వచ్చిన వాళ్ళు నిస్సంకోచంగా కలిసి తిరుగుతూండటం సామాన్య దృశ్యం . పరాయి వాళ్ళ తోటి కూడా పరిచయాలు అతి సులువుగా చేసుకుంటారు. పెద్ద పెద్ద కుటుంబాలలో అయితే పరస్పరం తెలిసిన వారొకరు పరిచయం చేస్తేనే తప్ప, ఒకరితో ఒకరు మాట్లాడ్డం మర్యాద కాదు. మధ్యతరగతి, ఇంకా తక్కువ కుటుంబాలలో ఇలా పట్టింపులు పెట్టుకుంటె ఎలా కుదురుతుంది ? వె ేమంతా ఇక్కడి మధ్య తరగతి కుటుంబాలలోనే లెక్క. అందుచేత స్త్రీ పురుషాదులలో కొత్తవాళ్ళతో మాట్లడవలెనంటె

ఇంకొకరు పరిచయం చేయడం అవసరం లేకుండానే మనము మాట్లాడవలెననుకున్న వ్యక్తి దగ్గరకు వెళ్ళి గుడ్ మార్నింగ్ అనో, గుడ్ ఈవెనింగ్ అని ఆపైన ఒక " ఎక్స్యూజ్

మీ " వాళ్ళ మొహాన పారవేసి పలకరించవచ్చును.

ఎటొచ్చి స్త్రీలతో పరిచయం ఇంత సులువుగా జరగదు. పురుషులకు లేని సందేహాలు స్త్రీలకనేకముంటాయి. అందుచె తను వారితో మాట్లాడవలెనంటె మాట్లాడి మర్యాదగా బయటపడవలెనంటే కొంచెము ముందు వెనుకలు ఆలోచించి మరీ పలుకరించవలసి ఉంటుంది. మధ్య తరగతి వారిలో కూడా రెండు రకాలు, మధ్య తరగతిలో పై అంతరువు వాళ్ళు బాగా తక్కువ వాళ్ళు కొంచెమించు మించుగా సమానమన్న మాట అందు చేతను ఈ జాతి స్త్రీ పురుషలతో పరిచయం సులువుగానే చేసుకోవచ్చు.

ఇక్కడ మా కాలేజి విద్యార్థినులతో కాక, పైన కనపడే యువతులతో పరిచయం చేసుకోవడం, వారితో వాహ్యాళికి, సినిమాలకి ,నాటకాలకు వెడుతుండటం ,అక్కడ చాల సన్నిహితంగా ఉండటం, అందరకు అలవాటె.

ఈ పరిచయాలు కొన్ని స్నేహితుల ద్వారా జరిగిన చాల వరకు పరాపేక్ష లేకుండ జరుగుతుండటం కద్దు .ఏ సెలవు రోజునో మరొకప్పుడు సావకాశముగా సాయం సమయమందు వీధి వెంట వెడుతుంటే కొందరు యువతులు మన ముఖాలకేసి తేరిపార చూస్తుంటారు. మనము పరదేశస్థులమని కావచ్చు, లేదా మనతో మాట్లడితే ఎలా ఉంటుందా అని కావచ్చు.మనము కూడా వారి వైపు చూసినప్పుడు వారు సిగ్గు పడకుండ కొందరు సాహసవంతులైన యువతులు ధైర్యముచేసి హలోఅని వారేనా మనని పలకరించవచ్చు.

కొంచెం భయపడుతున్న వాళ్ళయితే మనం పలకరించిన పలకవచ్చు. అప్పుడా హలోను సాగదీసి "సఖ్యం సాప్తదీనం" అన్నట్టు పదడుగులు వేసేటప్పటికి పరిచయమై ఏ కొండల మీదకో,సినిమాకో వెళ్ళనూ వచ్చును.పరిచయం ఎక్కువ చెసుకోను వచ్చును. కొందరు కొందరితో కొన్ని అనుభూతులు పొందను వచ్చును. లేదా కబుర్లతోనే కట్టి పెట్టనువచ్చు. కొంచెం ఇబ్బంది పడ్డా ఎవరూ ఏమీ పట్టించుకోరు.

నేనొక నాడు సముద్ర తీర గ్రామానికి ఒక నాటి సెలవులలో వెళ్ళినప్పుడు

పరిచయమైన అమ్మాయే మళ్ళీ ఇక్కడొక రోజు బజారులో తటస్థ పడింది. ఒకరినొకరు చూసి మందహాసం చెసుకున్నాము. ఏమండీ సేమ్ గారు కులాసాగా ఉన్నారా? ఈ

ప్రపంచమెంత చిన్నదో చూశారా? అంది ఆ అమ్మాయి.

నేను నవ్వుతు "ప్రపంచం చిన్నదే కాకుండా గుండ్రంగా కూడా ఉంటుందని పెద్దలంటారని" అన్నాను. అందుకనె మనం ఎక్కడెక్కడో తిరిగినా మళ్ళీ ఈ ప్రదేశంలో కలుసుకోగలిగాం అన్నదామె.

మీరు ఇక్కడ ఉద్యోగం కొనసాగిస్తున్నారా అని అడిగేను. మరి ఏం చేయనండి తప్పని సరి గదా అంది. అయితే మీ

